శ్రీరస్తు.

శ్రీమజ్జగద్గురవే నమః

# హరిహరస్తుతివారణమాల.



ధర్మవరపురవాస్తవ్యుఁడై

మామిళ్ళపల్లి సూర్యనారాయణునిచే

రచియింపఁబడెను.

ప్రతులు 500.

పిఠాపురమునందలి

శ్రీవిద్వజ్జనమనోరంజనీముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి

గ్రంథకర్తచేఁ బ్రకటింపఁబడియెను.

1911.

శ్రీరస్తు.

శ్రీమజ్జగద్గురవేనమః.

# హరిహరసుతవారణమాల.



శ్లో. నిరంజనం నిరాకారం, నిర్వికారం నిరామయం
నిత్యం శుద్ధం నిరాధార, మాద్యం తేజోమయం భజే॥

## గణపతిప్రార్థన.

శ్లో॥ గణనాథ మురారిపుత్ర్యలీలం, సురపాలం కరుణారసాలవాలం
బలవద్విధికార్యవిఘ్నజాలం, పరిహర్తుం విపులం భజే సుశీలం॥

క॥ సురమునిమానవులు నిను
స్థిరమతిముఁ బూజించి కార్య ♦ సిద్ధ్యాఢ్యులై
పరఁగిరి మద్దోషంబుల
హరియింపఁ భజించితిని గ ♦ ణాధిప! దేవా!॥

## కల్యాణి—ఆది.

శ్రీనాగభూషణం సదా భజేఽహం॥ శ్రీ॥
దీనావనపరం సురరాజం॥ శ్రీ॥

1. శంకరతనయం సంతతవినయం పంకహర ముఖయం భజే॥ శ్రీ॥
2. సద్గుణవాసం సంస్తుతదాసం మద్దానవికాసం భజే॥ శ్రీ॥

3. సూర్యనారాయణ స్తుతిపారాయణ సూర్యపూజితచరణం భజే॥ శ్రీ॥

## సరస్వతీప్రార్థన.

శ్లో॥ వీణాగానవినోదేన, భర్తారం యా కరో ద్విధం
సరస్వతీ ముపాసే తాం, శంకరాచ్యుతసన్నుతాం॥

గీ॥ మొదల వేల్పుమ్మ నర్థులై ♦ మునివరేణ్యు
లమలభక్తిని గొల్చి మ ♦ నోభిలాష
గాంచిరో యట్టివిధిరాణి ♦ కమలపాణి
వీణ నొప్పెడునలివేణి ♦ వాణి దలంతు॥

### బిలాహరి—అట.

వాణీ మహం గాయే॥ వాగమలతాయై॥ వా॥

1. జ్ఞానానందస్వరూపిణీం, మృదుభాషిణీం, జనపోషిణీం,
దీనతాగ్రిమనీషిణీం, దుర్జనమనోతిశోషిణీం॥ వా॥

2. మానినిర్జరసన్నుతాంఘ్ర, వాసీరమావృతాం, వీణాదండ
విలసితహస్తాం, విమలతరగీతప్రశస్తాం॥ వాణీ॥

3. ఇందుశేఖరవిధిజనార్దన, వందితాంఘ్రిపల్లవాం
కుందహారతుషారవిశదాం, మందహాసముఖారవిందాం॥ వాణీ॥



# విష్ణుస్తవము.

శ్రీమహావిష్ణవేనమః.

(1) శ్లో॥ శ్రీకాంతామణిమానసాబ్జనిలయం శ్రీకౌస్తుభాలంకృతం
దీనత్రాణపరాయణాదిబిరుదం లీలామనుష్యాకృతిం
శ్రీమద్వార్షికవారిదాంగ మభవం భూభారనిర్వాహకం
వందే ధర్మవరాభిధాననగరశ్రీరాజగోపాలకం॥

(1) సీ. దూర్వాదళశ్యామ ♦ దురితనికరభీమ, | భువనాభిరామ రఘు ♦ పుణ్యనామ
కల్యాణగుణనిధీ ♦ కరుణాపయోనిధీ, సంహృతభక్తాధి ♦ సర్వవేది
శారదపూర్ణిమా ♦ చంద్రికాసమమంద, హాసముంటరవద ♦ సారవింద
జన్మసంచితదోష ♦ చయతమోమథపూష, కౌస్తుభమణిభూష ♦ ఘనసువేష

గీ. దేహి సేవాం పదోస్త్రవ ♦ దీనపోష
పాహి పాహి గజ మిత మాం ♦ పరమపురుష
యనుచు వేఁడితి నన్నుఁ బ్రోవ ♦ నతులభాష
గాన గావుముసతతమ్ము ♦ కలుషశోష॥

## 1. హిందూస్తానితోడి—రూపకము.

దానవాంతకా కృష్ణా॥
దీనులఁ బ్రోవ నీవె, దిక్కుగదా నను
బ్రోవుము, పక్కితత్తడి యిత్తడీ॥ దా॥

1. భక్తులమానసమున నా, సక్తుఁడవై యుందువఁట!

భక్తులభాగ్యం బడేమొ, భక్తితోడ నినుఁ బాడితిఁ,
పాలింపుము నను సదయుత॥ దా॥

2. తనయుతప్పు లెంచునే, జననిఁ యెన్నఁడైన నీ, తన
యుఁడ నగువాఁడు తప్పు, లనుగాంచక గావింపు,
మాదరితము వనమాలీ॥ దా॥

3. చిన్న నాఁటనుండి నిన్ను, మనుపవాఁడ వని నమ్మితి,
పెనుభూతమువోలె మమ్ము, ఘనతరముగ బాధించెను,
ననిశధి వారి నడఁపవే॥ దా॥

(2) శ్లో॥ శ్రీరామం దత్తకామం సుమునిరచరితం పద్మపత్రాయతాక్షం,
వాల్మీకివ్యాసదత్తప్రముఖమునివరై స్సేవ్యమానాంఘ్రికంజం,
కర్తాకర్తాపహర్తారమఖిలజగతా మాదిమధ్యాంతశూన్యం,
వందే శ్రీరామచంద్రం ముఖరుచిజితసంపూర్ణచంద్రం సురేంద్రం॥

(2) ఉ॥ శ్రీపతి! దేవకీసుత! హ ♦ రీ! కరుణాకర! దానవాంతకా!
భూపతిశేఖరా! సుజన ♦ పోషక! శాశ్వతభక్తకల్ప! కృ
ష్ణా! పలుమారు నిందలను ♦ నాడియు నంతము లేనివాఁడ! మ
త్పాపవిమోచనా! సుగుణబద్ధక ♦ థాశ్రితచిత్ర! మాధవా!

## 2. కీరవాణి—అట.

దేవ! రామా, ప్రోవవేరా, దీనజనసంరక్షకా,
త్రోవ నీవే మమ్ముఁ బ్రోవ, దురితనాశనక్షమ॥ దే॥

1. వాసుదేవ! దేవా! శ్రీ, వత్సలాంఛనా!, దాసపోష!
మనుజవేష!, దనుజభుజగవినాయకా॥ దే॥

2. [illegible]! శ్రీ, రాజగోపాలకా!, సౌమ్యభక్తవశీల!
[illegible]!॥ దే॥

(3)శ్లో॥ ధృత్వా జన్మదినాకరాన్వయవరే శుశ్రూషన దుర్జనాన్
మత్వా హంతు మహోగ్రపాపనిరతాన్ గత్వా పురీం రావణీం
హత్వా రావణముఖ్యసర్వదనుజాన్ యోరక్షితాన్ సురాన్
వందే! ధర్మపురాభిధాననగరశ్రీరాజగోపాలకం॥

(8)సీ॥ రామాయ లోకాభి ♦ రామాయ మౌనిగీ, ర్వాణనుతాయ తు ♦ భ్యం నమోస్తు
విష్ణవే సర్వత్ర ♦ జిష్ణవే తాటకా, ప్రాణాంతకాయ తు ♦ భ్యం నమోస్తు
కర్తృణే దివ్యక్రతు ♦ హర్తృణే దశశతాం, గాగ్రసుతాయ తు ♦ భ్యం నమోస్తు
కౌశికతనయాయాస్త ♦ కుశలబీజాయ వే, దాంతవేద్యాయ తు ♦ భ్యం నమోస్తు

గీ. దేవదేవాయ రవికుల ♦ దీపకాయ

నవమనోజ్ఞకతారోడు ♦ పాయ రుచిర
వదనవిజితోడుపాయ తు ♦ భ్యం నమోస్తు॥

## 3. బెహాగ్—ఏక.

రామరాజకులభీమ, ముఖజితసోమ, రఘురామా॥ రా॥

1. కామాదిదళితం, కౌసల్యాసుతం, ధీమంతమిద్ధచరితం,
దీనజనావనమతం, దురితహరణం, సుజనశరణం,
మదభారహరణం, నిత్యం భజే॥ రా॥

2. విమలగుణాయ, కమలాప్రియాయ, సోమార్కనయనాయ
శ్యామలశరీరాయ, వినతతమసే, సదయమనసే
విమలయశసే, తే నమో॥ రా॥

3. నాట్యవాద్యగాన, స్తోత్రపరాయణ, సూర్యాయుతసంకాశ,
శోభాయుతకైలాస, సుగుణధామ, విజితకామ, భయనిరామ,
తేనమో॥ రా॥

వహుచునిన్నెద, మర్మమెల్లవిడచిదలచితిని, మారాడక
గావుమో శేషశయన॥ వ॥

(6)శ్లో॥ కేచిన్మూర్ధావదంత్యక్షిరధఃగృహభోగాదిభిస్త్వాంముదాంధా
స్త్వామాఃక్రంమర్త్యమాత్రంఃకురుఃకురుతత్వాపినాంసంగతింమే
తేసీతారామగోష్ఠ్యాంసహసుజనవరైస్సత్వసంజ్ఞానబీజాం
బుద్ధింసంకల్ప్యమహ్యంసతతమతిదయాందేహిమేప్రాణవత్సు.

సీ. మత్స్యరూపంబున ♦ మనుజాశనునిసోమ, కుని దునించితివి గాదె ♦ మునుల గావ
తాబేటి వౌము మం♦దరధరంబు ధరించి, కరి మలసితి గాదె ♦ సురల బ్రోవ
కిటిరూపమున పరా ♦ కుటిలహిరణ్యాక్షు, జంపితి గాదె స ♦ జ్జనుల గావ
నరసింహమున హిర ♦ ణ్యకశిపు శిక్షించి, యలరితి గాదె ప్ర ♦ హ్లాదు గావ
గీ. వామనతి భార్గవత్వంబు ♦ వరుస నొంది
సురల జనులను బ్రోచితి ♦ సొంపుగాను
భాగ్యవశమని నిర్మల ♦ భక్తి నిన్ను
వేడితిని రామమూర్తి నన్ ♦ విమలకీర్తి.

## 6. కాంభోజి—ఆది.

శ్రీరామాధన్యుడనైతి, పూర్వార్జితసుకృతఫలంబునని
బొడగాంచితినిగతకలుషుడనైతి॥ శ్రీ॥

1. కామమదంబునక, గన్నులుగానక, ఘనులసదాకంచింప,
దలచు, దురితాత్ములనుక చెంప, జేసి, గరువమంతయు
నణంప, వెగడు, సురమునిజనులునలరంప, నొప్పు, సురు
చిరయశమునపొంప, లరసి, ధరముగెంతనూడింపనవత
రించితివో॥ శ్రీ॥

2. [illegible]

సౌందర్యాధఃకృత, కామవిద్వజ్జపితపూత, నామకారుణ్య
సాగరా, నీకుహిమలగనుంగొనుటను, కామా, రికినలవియె
సుగుణ, దామహరీమామకపాపవిమోచనకారణకనికర
ము, నమనుపుము, నవరతము॥ శ్రీ॥

(7)శ్లో॥ శ్రీమచ్చిత్రిపవిత్రగాత్రవహరచ్చారిత్రిగాత్రస్త్రశ్రుతం
శుంభత్ఫుల్లసహస్రపత్రనేత్రమమలస్తోత్రైకపాత్రామృతం
సత్యాత్మానమనంతమీశవినుతం నిత్యం భజత్సంభృతం
శుద్ధ్యత్సజ్జనరక్షణక్షమమజం లక్ష్మీహృదీశం భజే॥

(7)శా॥ నాపుణ్యము ల్నరి సాధనంబు లవియే ♦ నావం చహంకారినై
కాపాడం దగుభక్తపాలురి నినుం ♦ గాంక్షింప కిట్లాడునా
పాపాత్ముం డెటుగాంచు నీదయను ♦ భారంబు వారింపవే
యోపాపౌఘవినాశ ♦ యోశుభకరాయోశ్రీశ యోకేశవా॥

## 7. పీల్వా—చాపు.

న్యాయమేనా, దేవదేవనన్ను బ్రోవకుండుట॥ న్యా॥
శాయకనెల్లపుడునీదు, భజనసేయుచుంటిగదా॥ న్యా॥

1. వాదమేలనాథు, వారపోషకనాదు, పాపమెడజిమ్మినీదు,
పాదభక్తినిడుహాతమధు॥ న్యా॥
2. పరమపురుషాకరి, వరదవేసారి, మొరలిడగాశౌరీ, బ్రోవ
వేమోమురారీ॥ న్యా॥
3. పరిహ్లాదామల, బాలించినావిల, నాహ్లీనమెసగ, నావ
రింపకిటులజాచుట॥ న్యా॥

(8)శ్లో॥ శ్రీనాథంపార్వతీశందురిహిణముడుపతింభాస్కరంవాయు[illegible]
సింనుంభూమింసుపర్ణీక్షావిచుదవలజనాకాపూర్వదేవాకావిహంగాన్

కాలంపక్షర్తుమాసంమధుదనుజరిపోసర్వలోకాక్షమహీజాన్
జానేవేదాంతవేద్యంవిబుధవిధిశివాసాధ్యమాద్యంప్రభుంత్వాం॥

(8)మ. శ్రవణంబుల్ స్మరణంబుకీర్తనముదా ♦ స్యంబుల్ సతంబొప్పగా
గవిశేషాత్మనివేదనంబుగదుస ♦ ఖ్యంబుల్ భవద్వందనం
బవనీశాతగునర్చనమ్మువరపా ♦ దాంభోజసంసేవయున్
భువిలోనాకుననుగ్రహింపగదవే ♦ భోగీంద్రశాయీహరీ.

## 8. కమాచి—జంపె.

నన్నుబ్రోవసమయమిదెవిజయరుచిరకాయ॥ న॥
కన్నులారనీదుపావనాకృతినిరతము, గాంచదలచియున్న
నామవాంఛితముదీర్ప॥ న॥

1. శేష, శయనవి, శేషకీర్తివి, భూషమ్మునసం, భాషపావన,
వేషదానవ, శోషవిపిన, పాషాణమును, యోషాగతికరు
ణించితివిరా, స్థిరతనీదుపాదంబులుమదినొల్చితిరా, చిత్త
జారిసేవితపాదారవిందయుగ॥ న॥

2. హరిహరహిరణ్యగర్భాదీంద్రులునీవని, రాకారసృష్టిస్థితిలయ
కారణతావక, కరుణోద్భవానందాబ్ధినిమగ్నహృదయుని,
గశేయుసమ్మదపరిద, నమ్మితిగదా, సదా॥ న॥

8. శ్రీరాజగోపాలబాలసూర్య, నారాయణపోషకరంజితకమా
చిత్త॥ న॥

శ్లో॥ మంగళశంఖచక్రాది, విలసద్దివ్యపాణయే,
శంకరాజదురాపాయ, హరయేలోకసాక్షిణే॥

కం॥ ఉష్ణాంశుశతప్ర పాలిత

## విష్ణుస్తవము!

కృష్ణా లక్ష్మీశ భక్త ♦ హృదయవిభావ్య
తృష్ణాలతావసంతా
కృష్ణా మంగళము విమల ♦ కృపం గైకొనుమీ॥

### జంఝూటి—ఆది.

హారతిగైకొను మయ్యామంగళ॥ హా॥
భూరికృపానిధీ భోగిశయనవిధి॥ హా॥

1. ధారాధరనిభ, తనువిలసితశుభ, దాయకాశ్రితాభయ, దానవ బిరుదాంకిత॥ వారి, జాతుమఘు, వైరిసాధుజన, మారివినుతమణి, ధారిహరీ॥ హా॥
2. బ్రహ్మవునీవే, పశుపతివీవేపర, బ్రహ్మవునీవేయని, భావించినేనిదు॥ హా॥

శ్రీకృష్ణార్పణమస్తు.



# శివ సవము.

శ్రీ మహేశ్వరాయ నమః .

(1)శ్లో॥ శ్రీమన్నందకటాక్షలబ్ధసకలైశ్వర్యపరిపూర్ణామరం
భాస్వచ్ఛ్వేతకపర్దిభూషణమహాభద్రాద్రినాథాభుజం
సంసారార్తవిజాంఘ్రిసేవకజనాత్యంతాభిరక్షాతురం
సంస్థాధర్మవరేపురేభవహరంధ్యాయామి విశ్వేశ్వరం.

(1)సీ. దురితగుల్మలవిత్రి ♦ సురమునినుతిపాత్ర, శౌరిమిత్రా గోత్ర ♦ జాకళత్ర,
పావనచారిత్ర ♦ పావకవిధుమిత్రి, సుకచిరనేత్రకరా ♦ సుంద్రగాత్ర
దివ్యజటాజూట ♦ భవ్యమహాకట, విలసద్ధరిత్పట ♦ విధుకిరీట
తీరార్ణవనిషంగ ♦ మారమదవిభంగ, భృతిబాలసారంగ ♦ వృషతురంగ॥
గీ. రమ్యసుగుణాయుతు ♦ రాజసుహృద్రతు
భక్తవర్యపతు ♦ పాపహతు
అభయదానదతు ♦ యాశ్రితావనదీక్షు
పురదనుజవిపతు ♦ గరళభృతు ॥

## 1. సావేరి—త్రిపుట.

శంకరా, నను బ్రోవసమయమిదేరా॥ శం॥

పంకజాక్షుడవనుచు సంతతము, శంక మాని నిను దగ భజియించితిరా॥శం॥

1. సకలలోకములు నీవె, చక్కని సృష్టిస్థితిలయములు నీవె, పరికలిత
చరితా దేవతలు, పంచభూతములు నీవె. అకలంకగుణుడవనా

(8)శ్లో. సింహోక్షోందురుబర్హిచక్రిణఇమేత్యంతం భవన్మందిరే
ప్యన్యోన్యం రిపవ స్తథాపిభవతస్సామర్థ్యమాత్రేణవై
తే సఖ్యాస్స్వప్రియదోహదైరిహసదాతిష్ఠంతి చైకోదరా
ఆశ్చర్యంశివసన్నిధానవసతిం మే దేహి విశ్వేశ్వర ॥

(8)మ. ఎంచితి మానసంబున న ♦ మేశ్వర తెల్లనిగట్టు పట్టు గా
వించి సతంబు భక్తులను ♦ నివ్వలచెట్టయి చుట్టునుండి యా
కించనుక భక్తిఁగొల్చుతిరిది ♦ వేకువఁ గాచితి వద్రిరాడయం
గాంచెను వారిలోనఁ దవ ♦ కట్టయి ఓట్టుగ నేలు దిట్టవే.

## 3. ఆనందభైరవి—రూపకము.

వాదమేలరా ♦ శంకరా నాతో ॥ వా॥

1. నీమహిమచేత నేకదా, నిర్జరులు నరాక్షసులును, మోదమం
దినీకొలకుల, మునిజనశ్రేష్ఠ నారదాభి, ముఖులైతోలిపగలుపిగిరి॥ వా॥

2. మృత్యుదేవతను గెల్చి, మృకండుసుతు గాచితివి, నిత్యదేవా
ద్యుపవిషే, నిజజనపోషకా, శ్రీనాయక శేషభూష॥ వా॥

3. దాసమానసవాస, భాసురయశోవిలాస, నీసమానమెవరీశ,
నీలగళాజాల మేలమేల ఫాలకీలసుశీల॥ వా॥

(4)శ్లో. శంభో త్వత్పుణ్యనామస్మరణవిభవతాత్స్వల్పకాలస్యలోకో
మోక్షంప్రాప్నోతి చిత్రంతమనయనకరాదీంద్రియాణాంప్రవృత్తిః
యుష్మత్సేవోపయోగాదతివిమలహృదః కుత్రతో మానవస్య
స్తోతుంజ్ఞాతుంకియాన్ వైగలితేహమతులా తాదృశీతీవృశీతి.

(4)సీ. అరివర్గముమద్రోసి ♦ వరశమాదులఁదాసి, యూర్మిషట్కముబాసి ♦ పేర్మిజేసి
కర్మేంద్రియంబుల ♦ కవ్వకిఁబూనిఁ, జీమయమఁ బెద్దఁ ♦ విత్తనుల

## 8. కన్నడ—ఆది.

ఓంకార పార్వతీనాయక, వేరేయాచనలేక, వేగనన్ను
గావుమిక॥ నా॥

1. పరమభక్తపాప, హరగిరిచాప,హరవ్యోమకే, శాశ్వతప్రద
మారవంశజలధినిశాపతినుత, సోమవిభాకరరథాంగశివస,
త్కరుణాకరపరమేశ్వరసురుచిర స్మరహరవందితురంగమ
శంకర॥ యా॥
2. కన్నతండ్రిదీశ, పన్నగవిభూష, కమలనికేతనా,కాంతశర॥ యా॥
3. నినువామనమునసమ్మితినిజముగ,ఘనమునిమానసనీరజనివాస
దీనజనావనదక్షగజాసన, జనకదీనుడనుసరగునబ్రోవు॥ మా॥

శ్లో. మంగళం పార్వతీశుద్ధహృన్మహోత్పలభాసవే
మార్కండేయమునిప్రాణాచంద్రార్కస్థితిహేతవే॥

కం॥ మంగళహారతి గైకొను
మంగజదర్పాద్రికులిశ ♦ యిష్టేశహితా
రంగదమలకారుణ్యాతి
శంగిరమత రజతశిఖి ♦ రాజవిహారీ॥

## మలయమారుతము—చాపు.

మంగళమోదేవ॥ మం॥
మహానీయసుగుణభావ॥ మం॥
1. అంగనగానువామభాగ, మందుపార్వతియిప్పెనగ, రంగు
మీరభక్తులకు, రంగటభాసిల్లునీకు॥ మం॥
2. శారదామరెల్లపరిసు, నానాసుమపరిమింప, గానము:

వారిమిగుల, గాపాడుకృపజెలగునీవు॥

8. నారాయణనిర్మలహృద, యారవిందగేహ, శారదాభ్రవి
శదదేహ, శైలోన్నతవృషవాహ॥

శ్రీపరమేశ్వరార్పణమస్తు.

కం॥ ఈవారణమాలఁజదువ
నావారణరాడ్వరదస ♦ మర్పణబుద్ధిక్
త్రావారణార్తిఁ గని మా
తా వారణ మొందు సత మ ♦ వంతు ఘనకృపక్॥

గీ॥ కొలుచంద్రేందువిధిసోమ ♦ వత్సరమున
మానితంబైనమహీధర ♦ మాసమందు
వచ్చు గూర్పింపఁబడె నిది ♦ యవని దీనిఁ
గృపఁగమంగొని బుధులాద ♦ రింతురుగాక.

(1911 సం॥రము, జూలై నెల.)

సంపూర్ణము.

శ్రీ.



